M. R. Ry.,

Reg. No. M. 2580.
సంవత్సరం చందా రు. 4-0-0 లు.




నెల్లూరుజిల్లా జమీందారి రైతు సంఘ పక్షమున ప్రకటింపబడు వారపత్రిక

సంపుటము ౧ | ఆదివారము | 1-6-1930 | నెల్లూరు. | సంచిక ౧౧

## ముల్లు–మొగ్గ.

వాలికుడు.

కావలిలో కోవూరు తాలూకా బోర్డుకు సంబంధించిన కాగితాలలో "గంగాభాగీరథీ సమానురాలైన"..."కుంకుమశోభితురాలైన"...అనేకలక్షణాలుగల కొన్ని జాబులు బయటబడినవి. ఇవి ఎన్నుకోబడినవారికంట! అధ్యక్షుడు ఆఫీసు జాబి తాలాలోజాలైనడి. ఇక భాద్యులెవరో!

• • •

ఇదిగూడ ఒక విధమైన అధికార దుర్వినియోగం క్రిందకు వస్తుంది. అవును పీటికి యీ ఎండలలో ఇంట్లో లీయనాడి దొరకదు. పైన అధ వారి క్రొత్త మొగమాటానికి ఎందుకు పాల్పడాల బ్రిటీష్ బావుటా బోర్డు ఆఫీసుమీద ఎగురుతా వున్నంతవరకు.

• • •

రెడ్లు పురాతన గౌరవాన్ని చెప్పుకొని బిగిసుకవర్తించేగాని కొత్తగ ఏమీగడించడంలేదు. పోలీసుడిమీద కొప్పడ్డా రెడ్లు తమస్థితిని తెలిసికొకుండా ఆత్మగౌరవము పోగొట్టుకుంటున్నారనక తప్పదు.

• • •

తన యింటి పాలు పెరుగు మొదలైనవి వకీలుకు పంపి రెడ్డెంసుబ్బయ్య వకీలు వంటబ్రాహ్మణుడు రొడ్లో పోసిటపేసిన పులిగంజి అన్నం తిని వస్తాడు. • • •

అధికారులు ఇతర కారణాంచేత మతిదప్పి ఆర్జీ రొయిత్తుకొనిపోయిన తమ్ముడిని రిట్టి జవాను అర్ధచంద్రప్రయోగాలకు పాల్పడ్డ క్రొద్దున్నే అన్న పిల్లాడిచు రోజ్యుమీపాలలో మోటారులోకోయి క్షమాపణ చేడిపిస్తారు.

### శాసనసభ ఎన్నికలు ఆగస్టులో జరుగును.

ఈమారు ఎస్టేటు ల్యాండు ఆక్టు సవరణకువచ్చును.

జాగ్రత!

ఇందు మీమాటపలుకగలిగినదెవరు? ధైర్యము వహింపుడు.

ఈమారు రెండు స్థానములకును జమీందారులే పోటీచేయుదురట! వీరా మీప్రతినిధులు.

లక్షాధికారులైయుండి నలుగురు మనుష్యులు చేతులలో వుంటారని రు. 18 నౌకరికి పోసిల్గాగ్గి వ్యగారివంలో తన "మోయన" మీద ఆధారపడివుండే రివిన్యూ ఇన్స్పెక్టరు రచ్చమీద కూర్చొనివున్నా చేతులు గట్టుకొని నిలబడి తనపదవి గవర్నరుపదవికి మించిందనుకొంటాడు యల్లారెడ్డి.

ఆంగ్లభావలో మంచి పట్టాలబొందిన ఇంటికి వచ్చి బూజు పట్టుకూ అర్థంకానిపదవులకు అర్రులు జాస్తూ అధికారులక్రింది మాపులు కృపాకటాక్షవాలనుకొంటూ అల్ప సంతోషముతో రాజీస్తూ పోట్లతాడు తూర్పిధి లచ్చారెడ్డి.

• • •

తాలూకాబోర్డు పదవులు మొదలైన దమ్మిడీన్నర గౌరవాలకు మోహాలుబడి ఊళ్లో పార్టీలు పెట్టుకొని యెల్ల మీద యోవారిమొదలు వకీలు గుమాస్తా వరకు గల ప్రమదగణం కాళ్లిదెబ్బలు తిరుపతి వెంకటేశ్వరుల పాదరక్షస్పర్శనుకొని మురుస్తుంటారు మాడ్లో పొరంచదువుకూ భోగం ఆమె వలపు కోర్కైన చదువుచాలించిన రెడ్డోం చిబ్బాయి. • • •

వెట్టేకర్ను పెరుగూ, చేసేపని చేస్తూ బాపనవెంకయ్యమాట జవదాటకుండా లోకుల మొగమాట ఆయనభుక్తికి వదలి పూసరవెల్లి రంగుల వలె విచిత్ర రకాల గుడ్డలుధరిస్తూ పెద్దవాళ్లకీర్తిని తారు బూస్తూ మోటారు దుమ్ముతో మేఘాల కల్పిస్తూ పోతుంటారు పిల్లరెడ్లు.

• • •

స్వలాభ మెరుగని ఒక రెడ్డి యువకుడు మామూలుగ్గా బెట్టని పెద్ద అధికారుల కరస్పర్శకుగా దేశనూద్యమాలలో 'అడ్డునిలిచి రెండు విధాలా భిగ్నమనోరథుడౌతున్నాడు.

• • •

ముక్కా జా వస్తువు మార్కెట్లో గొని ఇళ్ల [illegible] గాలించిన రెడ్డిసామ్రాజ్యప్రతిభ రాంట్లో యిమిడి [illegible] న్నదని చాటుతూ ప్రక్క వారిలోపలి నవ్వుల [illegible] తాడు బుచ్చిరెడ్డి

• •

## వెంకటగిరి తాలూకా చెఱువుల దుస్థితి.

కట్టలు లేని చెరువులలో నీరు లేదు— నీరుండిన చెరువుల కట్టలు తెగినవి.

ఈ నెల 14, 15 తేదీలలో వెంకటగిరి తాలూకాలో యుంటిని. ఇప్పటి యీ మధ్య కురియబడిన వర్షమువల్ల తటాకములన్నియు నిర్మల జలపూరితములై తమపిల్లకెరటముల తుంపురులచే చూపరుల హృదయముల రంజింపజేయుచు సంతోషమనేకమును పట్టజాలక తమ క్షేత్రములకున్నదు నెడలి సస్యపోషకులతో కలసిమెలసి గడుపురు మాయమనట్లు తమ హర్షమునుటకై యతియు-చున్నవి. యీ దృశ్యమును —చున్నది. యీ వంక సంతోషమును ...యైన తెగ్గించుటకు సరి చెరువు...లవు. వర్షమధికమైనను తెప్పకైనను ఆ ఫసలీ సుస్థిరపడదు. కొండల గాలిచే లేచిన కెరటములతాకుడుచే చెఱువుకట్టలు తెగిపోయి వట్టి చెరువయి కట్టలు తెగిపోవును. కొన్ని చెఱువులు కట్టలు తెగిపోయినవట. యింకగూడను నిలువజాలవని రైతులు భయమొందుచున్నారు. యీ ప్రమాదములకు ప్రభువులుచలించరట. రైతులే అలలకు అడు మండలమునకైరి కాపాడుకొనుచున్నారు. ఇప్పటి కొన్ని చెఱువులకు పైనుండి నీటిపారుదలవాకలు గలవు. వానికి అనకట్టలు వేసి చెఱువులకు త్రిప్పిన పుష్కలము పలుచోట్ల తప్పక ఫలించును. పరమేశ్వరుడిచ్చిన జలమును కాచుటకే సహాయపడరు ప్రభువులు వారిని అనకట్టలు కట్టుమని ప్రార్థించుట సమంజసముగాదు. గాని యీ పరిపాలన గవర్నమెంటువారిదే అయినయెడల యీ గ్రామముల రైతులంత దుర్బలులుగానుండరని దృఢముగా చెప్పగలను. మూడు సంవత్సరముల క్రింద సుస్థిరపోయిన భూమిస్తు యీ సంవత్సరము వసూలుచేయుట చాలఘోరమని రైతులు కడుపులమండి చేయుచున్నారు. తక్కిన విషయములలో ప్రభువుగారెట్లు ప్రవర్తించినను చెఱువుల విషయములో అశ్రద్ధ చేయుట చాల ఘోరము. కామధేనువైనను కడుపు నిండ మేత వేయుచున్నగాని పాలిచ్చును. కడుపులు మాడ్చి పాలుపిండిన ఎన్నాళ్లుపాలీయగలవు. కొన్నాళ్లకు నెత్తురుపిండి నిరుత్సాహము కలుగజేయకమానవు. ప్రజాక్షేమమునకై పరమేశ్వరునిచే నియమింపబడిన ప్రభువులవారు దయతో తమ కన్నబిడ్డలవలె ప్రేమించి చెఱువులవిషయమై తగు శ్రద్ధ వహింతురని వారిని వినయ వాత్సల్యములతో ప్రార్థించుచున్నాను.

ఇట్లు,
కొడవలూరు బలరా[illegible].

## వెంకటగిరి జమీందార్ల అక్రమం.

వేపచెట్టు కొట్టినందున రు. 72 జుల్మానా.

వెంకటగిరి సంస్థానంయిలాకా పోలూరుతాలూకాలోచేరిన తిరగ్రామములో గ్రామానికిఉత్తరపు దిక్కున డొంకలో వక వేపమాను గాలికి పడిపోయినది. ఆమాను రు 4—0—0 లు క్రయంచేయును. డొంకన వున్న మానికి సంస్థానంవారికి యేమిసంబంధము లేదని ఆ గ్రామస్థులు అందరుకలసి ఆ గ్రామాన లోయుండు వెంకటేశ్వరాలయమునకు యిచ్చారు. ముకు పనికివచ్చునని ... తహశీలుదారు మైలవరం సుబ్బయ్యగారికి తెలిసి వారు స్వయముగావచ్చి విచారించి అక్రమముగా యీ మానును పేకలుకోయించినారు. మీ మీద క్రిమినల్ కేసు పెట్టుతామని బెదరించి తనకు రు 25—0—0 లు యివ్వవలసినదిగా కోరినందుకు వారు డొంకపోరంబోకులో వున్న మానికి గ్రామసమిష్టికిహక్కు లేదా మాకు యెందుకుయిచ్చేది అని నిరాకరించినారు.

### న్యాయవిచారణకు దిక్కెవరు?

అసల గ్రామమునసబ్ కొట్టితలారి జవానుల పిలిపించి జబర్దస్తీ హడావిడీచూపి మీమీద క్రిమినల్ కేసుపెట్టించి మిమ్ములనందరిని జెయిలుకుపంపించుతాను. అనే మొదలైన ప్రగల్భములకుగట్టి అర్భాటములుచేసి చాలాభయపరచి రు. 72—0—0 డెబ్బయిరెండురూపాయలు సర్కారికి చెల్లించవలసినదిగా నిర్బంధపరచినందున గ్రామస్థులు న్యాయాన్యాయములు విచారించువారు యీ సంస్థానములో లేనేలేరు. వ్యవహారమునకు పోయినయెడల యెంత ఖర్చుపెట్టిఅయినా హైకోర్టువరకులాగిఅయినా మనల చాలా నష్టకష్టముల పాలుచేసుతారని కంటనీరుగార్చుచు గుటకలు మ్రింగుచు దుర్యోధనుడ్రో అని కొట్టుకుంటూ అనాథలగు శుష్కదరిద్రులు వారుచెప్పినప్రకారం రు 72—0—0 లు సమర్పించుకుని గంగజాతరచేసి గంగను వెళ్లనంపిన మోస్తరుగా వారిని పంపించినారు. సదరు పడిపోయినమాను క్రమముగా రాజాగారికి హక్కుకలిగి యుండినను చేయు క్రయం రు 4—0—0 లున్నా యింకాఅధనముగా రు 4—0—0 లున్నా జుల్మానా రు 8—0—0 లే తీసుకోనవలెను. అటుగాక చేయుక్రయం గాక 17 వంతులు అధనముగా చెల్లించినారు. తహశీలుదారుగారు అడిగినలంచమే యిచ్చియుండిన ఎడల అరతవంతే అయియుండేడిది.

### స్వల్పజీతముల దుష్ఫలము.

యీ ప్రకారం యీ జమీందారి తాశీల్దార్లు చేయడం యేమనగా వారికి స్వల్పజీతములున్నా ఆ జీతములయినా ఆరునెలలు దాటినా వెనుక యిచ్చేటందువల్లనున్నా తహశీలుదారుని వారికి యిచ్చుజీతము నెల 1-కి 40—0—0 లున్నా వారికంటుమనిషికిన్నీ, బండివాడికిన్నీ, బండియెద్దులకున్నూ చాలీచాలకనే పోతున్నది. అటుతరువాత నెలనెలకు రాదుగదా మిగిలినతనకుటుంబ ఖర్చులు యీవత్తు అతాలూకాలో యుండే దీన రయితుల ఆధారముమీదనే యుండుటవల్ల వారి గతులను ఆచారములను యేటుగలిపి వారి యిష్టప్రకారం విపరీత అన్యాయములు కల్పించేసి యీ ప్రజలను అదలించి, బెదరించి, పీడించి, పిప్పిచేసి బ్రతుకుట సహజమైపోతున్నది. యిట్టి అక్రమములకు యీ దీనరైతులు యెన్నికోజులు అయినా ఆందోళన పల్చక పూర్వకనే సహించుచుందురా? యీ దీనరయితులకు యీశ్వరుడైనా ధైర్యమనుగ్రహము గలుగగా.

తడ విలేఖరి.

## 33 సం॥ అనుభవించిన భూమిని లాగికొనుట.

వెంకటగిరి జమీందారీలో భూమికి ఋణంతీరినా దావాకు ఋణంతీరలేదు.

పోలూరుతాలూకా బోడిలింగాలపాడు గ్రామములో ఆదూరు నారాయణుడనువారు షుమారు 30 సంవత్సరములకు మునుపు కాపురము యుండినాడు అప్పుడు తనకు యేదోకొంచెం పట్టాభూమి తడ ఖండ్రిగలో యుండినది. అతను ఆభూమిని విక్రయించి సూళూరుపేటలో యిల్లు కట్టుకొని షుమారు 25 సంవత్సరములు జీవించి చెంగుంటకువచ్చి కాపురముండి యిప్పటికి 8 సంవత్సరములుగా చేసుకుంటూయున్నాడు. యిట్లు ఆగ్రామములోనే కాపురంలేక ఆభూములు తన స్వాధీనములోలేక యితర గ్రామములో జీవనం చేసి యిప్పుడు తలారి నౌకరిచేయు సదరు ఆదూరు నారాయణుడి మీద తాను మొదట విక్రయించేసిన భూమికొరకై నెం. 301/30 రున శ్రీ వెంకటగిరి మహారాజాగారు దావాచేసి నోటీసులు జారీ కాబడినవి. తాను గ్రామం వదలిన తర్వాత సర్వే అయినది. అనుభవందార్లకు పట్టాలు యిచ్చినారు. అనుభవం వదలి 33 సంవత్సరములు అయినది. యిప్పుడు అతనిమీద దావాచేసినా అతను అన్యాయముగా నష్టకష్టములపాలు కావలయునుగదా! యీ గ్రుడ్డినౌకరీతనమువల్ల యెందరో దీనులు చెడిపోగలరని ఇందువల్ల సవినయముగా విన్నవించుకున్నాను.

తడ ఖండ్రిగ వాసి.

వ్యవసాయ క్షేత్రము.

## పైరులను బాధకరమగు కీటకములు.

—

అన్ని విధముల పైరులకు కీటకముల బాధ కలదు. అవి చిన్నవయినప్పటికి విస్తారముగా యుండుటచేత తరుచుగా పైరులకు మిక్కిలి చెరుపు చేయును. వర్షపు చినుకులు చిన్నవయినను అవి విస్తారముగా పడుటచే పెద్ద ప్రవాహమయి పొలములకు చెరుపుచేయును. పురుగుల విషయముకూడా అటువంటిదే. ఒక పురుగు దాని జీవితకాలమెల్ల కొన్ని ఆకులను మాత్రము తినునుగాని లెక్కలేని పురుగులసంఖ్య పైరులో పడిన ఇవి అన్నియూకలసి ప్రతి ఆకునుతినివేసి పైరును పాడుచేయును. తన పైరునకు పురుగులచే చెరుపు తగులుచున్నదని ప్రతి రయితుకు తెలుసును. దానిని నివారణ చేయుమార్గము తెలుసుకొనుటకు అనేక పర్యాయములు కోరియుందును. సర్కారువారు ప్రస్తుతము అన్ని పురుగుల పరీక్ష నిమిత్తమై (Study), అందులో ముఖ్యముగా పైరులకు చెరుపుచేయు పురుగుల పరీక్ష నిమిత్తమై ప్రత్యేకముగా ఒక దొర గారిని నియమించియున్నారు. వ్యవసాయదారులు భూమిఖామందులు వారిపైరులు పురుగులచే నాశనము చేయబడినను, లేక పురుగుపట్టునని భయముగలిగినను వెంటనే సదరు సర్కారు అధికారికి తెలియచేసుకొని వారి సలహా కోరవలెను. ప్రస్తుతము ప్రతిజాతి పురుగు బాధను నివారణచేయుటకు సాధ్యముకాకపోయినను, అనేక పురుగుజాతుల విషయములలో సలహాలీయబడును. ఇదిగాక మిటీవారి పురుగులు పడి విస్తారము నష్టము కలుగేయడల పురుగులను పరీక్షించి అప్పటిసంగతి సందర్భములను విచారించి తగిన సహాయము చేయుటకుగాను, యీ విషయములలో తెలిసిన యొక యుద్యోగస్థుడు పంపబడును. సాధారణముగా బాధపరిచే పురుగులను చూపనిది సలహానిచ్చుటకు వీలుపడదు. "నా వరి పైరునకు పురుగు నేనేమి చేయవలెనో దయచేసి తెలుపకోరెదను," అని వ్రాయుటవలన ప్రయోజనము లేదు. వరి పైరునకు పట్టు పురుగులలో అధమము పంద్రెండు జాతులు కలవు. గనుక యేవిధమయిన పురుగుపట్టినదో తెలియదు. అట్లు తెలియనప్పుడు సలహానిచ్చుటకు వీలుపడదు. పైరులకు బాధకలిగించునట్టిగాని, బాధకలిగించునని అనుమానించినట్టి పురుగులను మాదిరిగా పంపించవలెను. అప్పుడు యే జాతిపురుగు నిజముగా నాశనము చేయుచున్నదో తెలుసుకొని, తగినవుపాయములు తెలుపబడును. జీవముతోయున్న పురుగులను ఒక కర్ర డబ్బీలోగాని, సత్తు డబ్బీలోగాని వేసి కొంచెము నలిపిన కాకితపుముక్కలన్న అవి తిను ఆకులనుగాని, కాడలుగాని మార్గములో ఆహారమునకుగాను ఆ డబ్బీలో వేసి టప్పాలో రిజిస్టరుచేయని బంగీగా (unregistered parcel) పంపవలెను. సత్తు డబ్బీ దొరకనియెడల ఒక వెదురు గొట్టములో జీవముతోయున్న పురుగులను వేసి కార్కుమూతిగాని కర్రమూతిగాని అమర్చి పంపవచ్చును. మూత గట్టిగా యుండునట్లు జాగ్రతగా చూడవలెను. బంగిమీద యెంటమాలజిస్టుగారి విలాసము కాకుండా పంపువారి పేరు విలాసమును వివరముగా వ్రాయవలెను. ఆ బంగీతోగూడా వేరేపుత్తరములో పంపబడిన పురుగులగురించి తమకు తెలిసినంత, ఏపురుగుపట్టినది, ఏవిధముగా పైరుకు హానిచేసినది, ఎంతవరకు నష్టము కలుగచేసినది ఎప్పుడు మొదట కనుపించబడినది, యిందుకు మునుపు ఎప్పుడయినను యీ చీడ పట్టినది లేనిది, మొదలగు వివరములు స్పష్టముగా వ్రాసిపంపవలెను. పురుగుల సంబంధించినయావత్తు బంగీలు పుత్తరములు యీ దిగువ విలాసమునకు వ్రాయబడవలెను.

వ్యవసాయ శాఖా ప్రచురణము.

—

ఇంటివైద్యము.

## కరక్కాయ.

—

కాలక్రమమున బాగుగపండి భూమిపై రాలినదియు, క్రొత్తగను, గట్టిగను, గుండ్రముగను, లావుగను నీళ్ళలో వైచిన మునుగునదియును, లావు చెరమగలిగి, చిన్నవిత్తులు గలిగియుండు కరక్కాయ ప్రశస్తమైనదగుటచేత సమస్తరోగములను పోగొట్టి సుగుణములనిచ్చును.

కరక్కాయ చప్పగను, మిక్కిలివగరుగను వుండును. అగ్నిదీపనము చేయును. శుక్రవృద్ధి, నేత్రములకు హితము, శరీరపుష్టి వీట్లనుకలుగజేయును. మరియు నిది శ్వాసము, కాసము, ప్రమేహము, మూలశంక, నులిపురుగులు, మలబద్ధము, గుల్మము, ప్లీహము వీట్లను నశింపచేయును. మధురముగను, పుల్లగను నుండుటవలన వాతమును, వగరుగనుండుటవలన పిత్తమును, కారముగనుండుటవలన కఫమును పోగొట్టును. నూరి పుచ్చుకొనిన విరేచనమగును. ఉడికించి పుచ్చుకొనిన మలమును గట్టిపరచును.

కరక్కాయను యెండకాలమునందు బెల్లముతోను, వర్షకాలమునందు సైంధవలవణముతోను, శరత్కాలమునందు తెల్లచక్కెరతోను, హేమంతకాలమునందు శొంఠితోను, శిశిరకాలమునందు పిప్పళ్ళతోను, వసంతకాలమునందు తేనెతోనుజేర్చి భుజించిన "గరుత్మంతుడు సర్పములనశింపజేయునట్లు" సర్వరోగములను నశింపజేయును.

యె. కొండయ్య.

—

దేవాలయ ప్రవేశ సత్యాగ్రహ విజయం.

బెంగాలులో మున్షిగంజ్ నందు కాళీదేవాలయ ప్రవేశమునకు అస్పృశ్యులు 9 నెలలుగా సత్యాగ్రహమును జరుపుచుండిరి. యిప్పుడు 200 మంది స్త్రీలు దేవాలయ తలుపులుదెరచి అస్పృశ్యులను దేవాలయములోనికి రానిచ్చిరి.

తంతితీగల నరుకుడు.

దేశమునందు పెషావరు మొదలు కన్యాకుమారివరకు చాలచోట్ల తంతితీగలను నరికివేయబడినవి. మన మండలమున కొడవలూరు దగ్గరగూడ నరకబడినవి. కాంగ్రెసుపై నిందమోపుటకు ఒక రెడ్డి దీనిని గావించినట్లు అనుమానింపబడుచున్నది.

టాగూరు ఉపన్యాసములు.

మహాకవి రవీంద్రనాథ టాగూరుగారు లండనులో హిబర్టు ఉపన్యాసముల ప్రారంభించిరి. మొదటి ఉపన్యాసము "మనుజుని మతము" గూర్చి భాషించిరి.

—




## జాగరణము!

సత్యాగ్రహ మహాసంరంభము ప్రారంభింపబడినది మొదలు మూకీభావము వహించియుండిన అధికారులు ఉద్యమాసక్తులకు విసుగు జనింపనున్న యీ తరుణమున మండల నాయకుల నిర్బంధించి మరల అఖండోత్సాహమును రేకెత్తింపజేసిరి. నిర్బంధ మహావ్యాళమునకు సంపన్నులు, అజేయోత్సాహభూషితులు ఐదుగురు రెడ్డియువకులు ప్రథమ కబళమైరి. రెండవ కబళముగ యల్లాయపాలెం యువకులు మరి ఒక శెట్టిగారు సమర్పించుకొనిరి.

దుర్భర పరితాపములగు చెరసాలలేల నేడు క్షేమంకర పరిణయ గృహములైనవి? ఐశ్వర్యపు ఒడిలో లాలింపబడుచుండిన ఐహికవాంఛారహితులేల కష్టముల వరించుచున్నారు? అగ్నిపర్వత అగాధకుహరమునందలి కుములువలె స్వాతంత్ర్యేచ్ఛ హృదయములందు రేగిరేగి మానసిక అశాంతినిగూర్చి భారతీయ మానసమును ప్రబుద్ధులజేసి యీ సత్యాగ్రహ సమర రూపమును దాల్పజేసినది. అఖండ బ్రిటీషుసామ్రాజ్యము భారతీయుల యిప్పటి నాగరికస్థితి గొనివచ్చినదను విషయము సంశయించువారు లేరు! శాంతియుతమైన రాజ్యాంగవిధాన ప్రదాయినియనుట నిర్వివాదము కానీ; విదేశీయుల స్వారాజ్య కల్పమగు సత్పరిపాలనము లోపభూయిష్టమైన స్వరాజ్యమునకు సాటికాదను పాశ్చాత్యసూత్రమే నేటి ప్రచలనమునకు బీజము. మునుపటివలె రాజకీయములే వృత్తిగాగలిగిన ఏ కొలదిమంది విద్యాధికులో నేటి ఉద్యమ భారధుర్వహులుగా లేరు. స్వాతంత్ర్య శంఖానినాదము ...శాంత గ్రామ్యకుటీరములలో గూడ ...వన్నది. కొన్ని సంస్కరణములకే అజీర్ణమును బొందుచుండిన పెద్దలు డొమినియన్ స్టేటసుకు తక్కువ గిట్టదనుచున్నారు. అనేకులు ఇంగ్లీషురచయితలు వాకొనుచున్నట్లు మహాత్మునితో ఏకీభవించకున్నను వారి యీ యుద్యమమును ధిక్కరించువారే లేక సంధి వారితోనే చేసికొనవలెనని ఎలుగెత్తి చాటుచున్నారు. వీనియు జఘనములగుచో రాజకీయవేత్తల కావాసమగు ఇంగ్లండు పదకమును చేతులార చెడగొట్టినదగును. మహాజ్వాలాసక్తిని శాంతిమయ జృంభణమును అపార్థమునుచేయక ఇట్టి ప్రచలనము దైవనిర్దిష్టమని దానిని సన్మార్గమున నడుపుట నేర్పరితనము.

సంపన్నులగు రెడ్డియువకులు చెరసాలలలోనికి పరుగులెత్తుటయందలి అంతరార్థమేమి? వ్యక్తిగతములగు సఫలనొందవలసిన కార్యములేవు. వీరికిసామాన్యప్రజయొక్క ఆకలిబాధానలమువలె కాల్చుచున్నను కానిరి: బీదలఆశ్రయశూన్య బాధల స్ఫురణమే వారి రమ్యహర్మ్యవాసమును కంటకనిర్మితపాన్పుగమార్చినది. అహహా! ఇంతటి మహోన్నత మానసిక నైర్మల్యము, వైశాల్యములకు హేతువెద్ది? బుద్ధభగవానుడు, క్రీస్తుదేవుడు, మహమ్మదు ప్రవక్త మొదలుగాగల ఋషిశ్రేష్ఠులు జర్జరితపక్షులై కృశీభూతాంగములతో కనుగొన్న సత్యజ్యోతి జన్యమైన యీ సమత్వ భావాంకురమునకు తొలకరి యయినట్టి గాంధీమహాత్ముని నిర్మల చరిత, అహింసాప్రబోధములను క్రైస్తవ ప్రపంచము ఉపేక్షింపరాదు. మానవలోకమును స్వర్గతుల్యముగ జేయదలచి ఋషులు వాంఛించిన మానసిక ప్రవృత్తికి ఇది ప్రథమ సోపానము.

గోపాలరెడ్డి పూర్వసంచితముచే యోగ్యత గల సంపన్నుడు, సువాసగుబాళించు అభిరుచులు గలవాడు, హృదయము నిచ్చు మిత్రుడు, ధనికుడయ్యు ధనికుల క్రూరనిరంకుశతచే ఇతని మేనుపులకలెత్తును. ఏవిధమైన నిరంకుశతలనుగాని సహింపని హృదయమగుటచే నేటి విదేశీయుల నిరంకుశతపై తిరుగుబాటు గావించుచున్నాడు. ఇతని హృదయావేదనమే నవ్యభారతావేదనము. ఇతని తిరుగుబాటే తరుణభారత స్వాతంత్ర్యేచ్ఛ. దీనిని నిరోధించిన వక్రమార్గముల దొర్లును. అట్టి అవకాశముల గల్పింపరని బ్రిటీషు రాజనీతియందు మా కత్యంత విశ్వాసము.

---

## మరికొన్ని నోటీసులు.

---

మైపాడులో తాటిచెట్ల నరికివేయుటకు క్రిందివారికి నోటీసు ఒసంగబడియున్నది. 2 తేదీకి వాయిదా వేయబడినది:—

గండవరపు హనుమారెడ్డి, పట్నం బాలిరెడ్డి, వరిదిరెడ్డి కోదండరామిరెడ్డి, దేశా వెంకురెడ్డి, కాటంరెడ్డి లచ్చారెడ్డి.

**సత్యాగ్రహము.**

నాగపూరునందు మహారాష్ట్రనాయకుడు బారిస్టరు అభయంకరుగారు అరెస్టుచేయబడిరి. వడాలాదాడియందు దెబ్బలు తిన్న మరియొకడు చనిపోయినాడు. కొయిరా తాలూకాలో 6953 వాలంటీర్లు చేరియున్నారు. 1824 మునసబులు రాజీనామా లొసంగిరి. వేదారణ్యములో డాక్టర్ రాజన్ గారిని అరెస్టుచేసిరి. మదరాసు నగరము 13 మందిని అరెస్టుచేసిరి.

**సైనిక శాసన ధిక్కారము.**

షోలాపూరునందు సైనికశాసనము ప్రకారము జాతీయ పతాకములు నిషేధింపబడుటచే అచట సత్యాగ్రహము నెరపుటకు తీర్మానింపబడినది.

**షుమారు 4000 శిక్షితులు.**

ఇంతవరకు దేశమంతటను సత్యాగ్రహ సైనికులు 4000 మంది కారాగృహములకు పంపబడియున్నారు.

**వాణిజ్యసంఘమువారి విజ్ఞాపన.**

భారతదేశము నందుగల అన్ని వాణిజ్య సంఘములవారును కలసి రాజకీయ పరిస్థితులను గూర్చి ఒక విజ్ఞాపనను వైస్‌రాయిగారికిపంపిరి. అందు బ్రిటీషువారి వాగ్దానములు తృప్తిని గూర్పజాలకున్నవనియు, గాంధీజీలేని రౌండుటేబిలు సమావేశము నిష్ఫలమనియు, వారి 11 షరతులు వెంటనే పూర్తిచేసిన కనడా ఆస్ట్రేలియాలవంటి స్వపరిపాలనము నొసంగవలయుననియు, దీనికి తక్కువ ఎవరికిగాని తృప్తిని గూర్పజాలదనియు, 1921 అసహకారోద్యమమునకు యిప్పటి సత్యాగ్రహమునకు చాలభేదముగలదు. యిప్పుడు గాంధీజీ ఉద్యమమును ఏ రాజకీయపక్షముగాని నిరోధించుటలేదు. రౌండుటేబిల్ సభ డొమినియన్ స్టేటసును గూర్చి చర్చించినగాని లాభములేదు. మహాత్మునితో రాజీచేసికొనిననేగాని దేశమున శాంతిచేకూరదనియు మొదలగు అంశము... ప్రకటనమునందు గలవు.

దేవిగారు విశాఖపట్నమున అరెస్టు చేయబడి 9 మాసములు శిక్ష విధింపబడిరి.

### శాస్త్రిపదవిని వదలుకొనుట.

డాక్టరు వి. జే. థంజేయగారు తమకు ప్రభుత్వమొసంగిన శాస్త్రిపు బిరుదమును ప్రభుత్వ విధానముపట్ల అసమ్మతిని తెలుపుటకుగా వదలుకొనిరి. గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు తమ మదరాసు శాసనసభా సభ్యత్వమును వదలుకొనిరి.

### భారత క్రైస్తవుల సహాయము.

భారత క్రైస్తవ వార్షికసమావేశము బెంగుళూరునందు కూడి మహాత్మునికి అహింసా సమరమునకు విజయము చేకూరవలెననియు, ఇర్విన్‌ప్రభువు సకాలమున తగినపనిచేసి కాంగ్రెసు నాయకుల విశ్వాసమును పొందుటకును ప్రార్థనలు సలిపిరి.

చక్కరయ్యశెట్టిగారు (జస్టిసుపక్షము.) మహాత్ముని ఉద్యమమును క్రైస్తు ప్రచారమునకు పోల్చి గాంధీకి ప్రపంచములో అహింసా సంతం ఘనమైన తీవ్ర విప్లవకారుడని చెప్పిరి. దుర్ఘటమైన అహింసావ్రతమును గాంధీ సాగించుచున్నారు అనిరి.

### కామన్సులో చర్చ.

కామన్సుసభలో బ్రాక్వేగారు భారతదేశ చర్చను ప్రారంభించిరి. బెన్‌గారి జీతమును అసమ్మతిని తెలుపుటకుగాను తగ్గించవలయునను వినయము ఆమోదించబడెను. బెన్‌గారు ప్రత్యుత్తరమొసగుచు భారతస్థితి బాగున్నదనియు, ప్రాణపాటము రాడి తమ చర్యలను సమర్థించుకొనుచు మహమ్మదీయులు సత్యాగ్రహమున చేరలేదనిరి.

### గుంటూరులో 32 క్షత్రియుల అరెస్టు.

చేతాళం సుబ్బరాజు మొదలగు 9గురికి 9 మాసముల కఠినశిక్ష విధింపబడినది. ఇంతవరకు సత్యాగ్రహమున 32 క్షత్రియులు శిక్షితులైయున్నారు. బెజవాడలో డాక్టరు హనుమంతరావుగారికి శిక్ష విధింపబడినది.

### శిస్తుల నిరాకరణము.

నెల్లూరుమండలమున అలగానిపాడు రైతులు మహాత్ముని నిర్బంధించినందులకు యీ నెల 30 తేదివరకు శిస్తులు కట్టకూడదని తీర్మానించుకొనిరి. ప్రభుత్వము పశువుల జప్తిచేసికొని పోయినది. రైతులు చలింపకున్నారు. గ్రామమునసబు అనులాపు కోటారెడ్డిగారు రాజీనామానిచ్చిరి.

### మాలవీయ పండితుని అరెస్టు—విడుదల.

పండిత మదనమోహన మాలవీయగారు కొందరు అనుచరులతో సరిహద్దు ప్రాంతములకు పోవుచుండ క్యాంబెల్‌పూరునందు ఫ్రాంటియర్ రెగ్యులేషను ప్రకారం అరెస్టు చేసి రావల్పిండికి తీసికొనివచ్చి వదలివేసిరి. మాలవీయగారు యీవిధముగా 7 మార్లు శాసనోల్లంఘనము గావించియున్నారు. ముందేమిచేయుదురో ఇంకను తెలి

### నెల్లూరు మండలమున గొలుసనరుకుట.

కోవూరు నెల్లూరు తాలూకాలందు కల్లుగొలుసనరుకుట సామాన్యమైనది. మైపాడు, ఇందుకూరుపేట మొదలగు గ్రామములలో గ్రామస్థులే నరికిరి. కోవూరు ఇనమడుగు ప్రాంతములందు పోలీసుల సహాయముతో వాలంటీర్లు తాళ్ల చెట్ల గొలుసులను నరికివేసిరి.

### మరియొక వనితకు శిక్ష.

ఢిల్లీయందు స్వర్గీయ శ్రద్ధానంద స్వాములవారి మనుమరాలు సత్యవతీదేవిగారు 108 సెక్షను క్రింద విచారింపబడి 6 మాసముల విడిఖయిదు విధింపబడినది.

## నెల్లూరుజిల్లా జమీందారీ రైతు ప్రథమ మహాసభ.

జూను 21, 22 తేదిలలో సూళూరుపేటలో జరుగును.

| | |
|---|---|
| ఆహ్వాన సంఘ సభ్యుల రుసుము | రు. 2—0—0 |
| ప్రతినిధులకు | 0—8—0 |
| ప్రేక్షకులకు | 0—4—0 |

టి. పోలయ్యనాయుడు,
స్వాగత సంఘాధ్యక్షుడు.

## ఆంధ్ర జమీందారి రైతు మహాసభ.

జూను 22 తేది సూళూరుపేటలో జరుగును.

| | |
|---|---|
| ప్రతి నిధిరుసుము | 0—8—0 |
| ప్రేక్షక రుసుము | 0—4—0 |

### దర్శనాదాడి.

దర్శనాదాడిని సాగించుటకు వాలంటీరు జట్లు ఆప్రాంతములందు కూడుచున్నవి. ఫుక్కాడియందు 144 సెక్షను ధిక్కరించుచు మణిబెన్ పటేలుకన్యగారి యాజమాన్యమున ఒకపెద్ద ఉత్సవము జరిగినది.

### నేపాడులో అరెస్టులు.

నేపాడుకొత్తూరులు దాడిసందర్భమున 28 వాలంటీర్లు అరెస్టుచేయబడిరి. రాజమహేంద్రవరమున పాలకోడేటి సూర్యప్రకాశరావుగారికి 117 సెక్షను వుప్పుచట్టము 74 సెక్షనుక్రింద 2 ఏండ్ల కఠినశిక్ష విధింపబడినది. యీ నేరమునకే నెల్లూరులో 4½ మాసముల శిక్ష ఒసంగబడినది.

## కాళిందీనది పారుదల.

### వేంకటగిరి జమీందారుల ఉపేక్ష.

25—5—1930 సం॥ పగలు 2 ఘంటలకు సూళూరుపేటలో కాళిందీనది పారుదలక్రింద రైతులందరు మారంరెడ్డి సుబ్బరాఘవరెడ్డిగారి అధ్యక్షత క్రింద సమావేశమై ఇట్లు తీర్మానించిరి.

1. “వెంకటగిరి జమీందారి యిలాకా పోలూరు తాలూకాలో చేరిన కాళిందినదివల్ల పారుదల అయ్యే కాల్వలు చెర్వులు చాలాకాలముగా అనగా షుమారు నలుబది సంవత్సరములుగా మరమ్మతులు లేక సదరు కాల్వలు వగయిరా పారుదలలు చాలా హీనస్థితికి రాబడి అందువల్ల ఈపారుదల క్రింద రైతులెల్లరు చాలా కష్టములు అనుభవించుచూ అట్లు జమీందారువారు రిపేరుచేయక పోవుట చాలా అక్రమమునిన్ని చాలా అన్యాయమనిన్ని, అభిప్రాయపడుచూ యికనైనను జమీందారుగారు వెంటనే సదరు రిపేరు వగయిరా కార్యక్రమమునకు పూనుకొని తక్షణం సరచేసి, కోల్పోయిన రైతుల సానుభూతిని తిరుగా సంపాదించవలసినది” యని యీసభవారు తీర్మానించుచున్నారు.

ఉపపాదకులు:—తనమాల మునుస్వామిరెడ్డి
ఆమోదకులు:— నక్కేటి సుబ్బయ్య.

2. “సదరు పారుదల విషయమున అవసరమగు యావత్తుచర్యలు జరుపుటకు సంపూర్ణాధికారముతో ఈక్రింది వారిని ఉపసంఘ సభ్యులుగా ఎన్నుకోవడమైనది. యీ ఉపసంఘము యొక్క యావత్తు కార్యక్రమము నడుపుటకు ఈ ఉపసంఘ సభ్యులగు బద్దిపూడి వెంకటనారాయణరెడ్డిగారికి సర్వాధికారమివ్వడమైనది.

ఉపసంఘసభ్యులు:—

కిలారి మునుస్వామినాయుడు.
బద్దెపూడి వీరారెడ్డి.
బద్దెపూడి వెంకటనారాయణరెడ్డి.
నక్కేటి సుబ్బయ్య.
మీగాంజూరు మునుస్వామిరెడ్డి.

పైతీర్మానములు ఏకగ్రీవముగా అంగీకరించడమైనది.

## పాములకాల్వ క్రింద వ్యవసాయము.

వేంకటగిరి జమీను రైతుల కార్యోత్సాహము.

25–5–1930 సం॥ పగలు 3 ఘంటలకు సూళూరుపేట సత్రంలో పాములకాల్వక్రింద పారుదలకాతగిన గ్రామముల రైతులందరు మారంరెడ్డి సుబ్బరాఘవరెడ్డిగారి అధ్యక్షత క్రింద సమావేశమై క్రింది తీర్మానముల గావించిరి.

1. వెంకటగిరి జమీన్దారి యిలాకా పోలూరు తాలూకాలో చేరిన పాములకాల్వక్రింద పారుదలకాతగిన (1) వెంగ్లూరుపాడు, (2) కావలూరు, (3) గొడ్డగుంట, (4) కొండెంబట్టు, (5) జువ్విచెలిక, (6) మన్నారుపోలూరు, (7) వనమటి ఖండ్రిగ, (8) పులివేంద్ర, (9) అంగుంపాల, (10) ఖాశింఖాను ఖండ్రిగ వగయిరా గ్రామముల రైతులు సరియైన నీటి పారుదలలులేక చాలా బాధలుపడుచూ సరి అయిన పంటల్లులేక రైతుల ఆర్థికస్థితితగ్గి, అప్పులుచేసి శిస్తులు చెల్లించుకుంటూ పడరాని యిడుములు పడుచుండుటవల్ల జమీందారుగారు వృధాగా సముద్రమునకు నీరు ప్రవహించుచుండు పాములకాల్వకుఅడ్డకట్టకట్టి పైగ్రామములకు కాల్వలు త్రవ్వించి రిపేరీ మొరుగని చెఱ్వులను రిపేరీలు చేయించి ఈరైతుల అభివృద్ధికై జమీందారుగారు వెంటనే శ్రద్ధవహించి పై కార్యక్రమమును నెరవేర్చవలసినదిగా యీసభవారు ప్రార్థిస్తున్నారు.

2. పై విషయమున అవసరమగు యావత్తు కార్యక్రమము నడుపుటకు ఈ క్రిందివారిని ఉపసంఘసభ్యులుగా యెన్నుకుంటూ కార్యక్రమము నడుపుటకు వేనాటి మునుస్వామిరెడ్డిగారికి సంపూర్ణ అధికారమివ్వడమైనది.

చిల్లకూరు మునుస్వామిరెడ్డి—వెంగ్లూరుపాడు.
చిల్లకూరు రామసుబ్బారెడ్డి—ఖాశిఖానుడిఖండ్రిగ.
గండవరం నారాయణస్వామిరెడ్డి—గొడ్డగుంట.
వేనాటి వీరరాఘవరెడ్డి—చేనిగుంట.
వేనాటి రంగారెడ్డి—కట్టవ
వేనాటి మునుస్వామిరెడ్డి—చేనిగుంట.

పై తీర్మానములు యేకగ్రీవముగా అంగీకరింపబడినవి.

---

## వార్తావాహిని.

---

### ఫిలిప్పయిను దీవులకు స్వాతంత్ర్యము.

అమెరికా స్వాధీనమునందున్న నీగ్రో దేశము ఫిలిప్పయిను దీవులకు స్వాతంత్ర్య మొసగవలయునని సెనేటు కమిటీవారు తీర్మానించిరి. క్రొత్త రాజ్యాంగ విధాన మొసంగబడును. దేశీయులు సంపూర్ణ స్వాతంత్ర్యమును గోరుచో దానికి అనుకైన రాజీలు చేరపబడును.

### సిరియను స్వాతంత్ర్యము, సత్యాగ్రహ విజయము.

ఆసియా ఖండమునందు సిరియా దేశము యెన్నటి యుద్ధానంతరము ఫరాసు ఆధీనమున నుండినది. ఆ దేశీయులు స్వాతంత్ర్యసంపాదనమునకై గాంధిమహాత్ముని సత్యాగ్రహమువంటి విధానము నవలంబించను ప్రారంభింపగనే ఫ్రెంచివారు పెద్ద మనస్సుచేసికొని సిరియనులకు రాజ్యాంగ ప్రణాళిక నొసంగిరి.

### ఇండియా నుండి ఇంగ్లండుకు టెలిఫోను.

భారత దేశమునుండి ఇంగ్లండు దేశమునకు తంతిలేని టెలిఫోను విధానమును నిర్మింపను ప్రయత్నములు జరుగుచున్నవి. పనులన్నియు మూడు నెలలలో ముగిసెను. అటు తరువాత పని ప్రారంభింపబడును.

### 22 ఏండ్ల వైమానికురాలు.

ఇంగ్లండులో యీ నెల 4 తేది 22 ఏండ్ల బాలిక మిస్. అమిజాన్సన్ అను నామె ఏకాకిగా విమానమున బయలుదేరి 20 దినములలో సురక్షితముగా ఆస్ట్రేలియాయందు దిగినది. సామ్రాజ్యమంతయూ యీ మెను అభినందించుచున్నారు. ఇంగ్లండులో ఒక పత్రిక 10000 పౌనుల విరాళమీమెకొసంగినది.

### ప్రభుత్వ ఔదార్యము.

పెషావరుజిల్లాయందు వానలులేక దారుణ కాటకము సంభవించుటచే ప్రభుత్వమువారు రు. 200000 లు శిస్తు ముజరాయిచ్చిరి.

### కూలీల పోరాటము.

రంగూనులో రేవు కూలీల సమ్మెజరిగినది. సమ్మె ముగియగానే తెలుగువారు పనిలో చేరగా బర్మావారికి వీరికి పోరాటము జరిగినది. యిరు పార్శ్వము 80 మందికి గాయములు తగిలినవి 3 గురు తెలుగువారు చనిపోయిరి.

### కాంగ్రెస్‌పత్రిక నిలిచిపోవుట.

వద్దూరు అన్నపూర్ణగారిచే నెలకొల్పబడిన కాంగ్రెసుపత్రిక ప్రస్తుత సంపాదకులు శ్రీయుత లింగరాజుగారు కైదులుకుపోగా క్రొత్త డిక్లరేషను రు. 2000 లు ధరావత్తు కోరుటచే పత్రిక ఆగిపోయినది, ఇక సైక్లోస్టయిలులో వెలువడును.

### క్రొత్త గ్రహము పేరు.

కెర్ట్స్యూకు సమీపమున నూతనముగా కనుగొనబడిన పెద్ద నక్షత్రమునకు "ప్లూటో" అను పేరు పెట్టబడినది.

### మదరాసు శాసనసభ ఎన్నిక.

మదరాసు శాసనసభలకు గూర్చి శ్రీ గవర్నరుగారు త్వరలో ఒక ప్రకటనను గావింపనున్నారని తెలియుచున్నది ఎన్నికలు ఆగష్టు అంత్యమున గాని సెప్టెంబరు ఆరంభమునగాని జరుగునని ఉదకమండల వార్తలుతెలుపుచున్నవి.

### పాటియలా విచారణ.

పాటియాలా విచారణసంఘమునెడ్ల అసమ్మతిని తెలుపుటకు 15 మంది శిక్కులు సిమ్లాకుబోవుచుండ మార్గమున నిరోధింపబడిరి. అందుచే ఒక రాయభారమును పంపుచున్నారు. విచారణాధికారి ఫిడ్జి ప్యాట్రిక్ గారిని పాటియాలా మహారాజాగారే సూచించుటచే ప్రజలకు న్యాయము జరుగదనుచున్నారు.

### సంస్థాన ప్రజాసంకార్య నిర్వాహకవర్గము వారు యీ క్రింద ప్రకటనను గావించుచున్నారు:—

ఇప్పటి విచారణయందు పాల్గొనరాదని తీర్మానించుట యీ కారణములచేతనే:—విచారణ శాస్త్రసమ్మతముగాదు. (మాంటుఫర్డువలె 309 పారా ప్రకారం 5 గురు గల సంఘమును హైకోర్టు న్యాయవాది రాజమాన్యమున వైసురాయి నియమింపవలయునని యున్నది.) యిప్పటి అధ్యక్షునికి న్యాయశాస్త్ర పరిజ్ఞానములేదు. మరియు పాటియాలా మహారాజాగారిచేతనే నియమింపబడియున్నారు. దీనికి తోడు రహస్య విచారణమున ప్రజలకు న్యాయముజరుగదు. ఇది గాని మహారాజాగారు సంస్థాన సంరక్షక శాసనముక్రిందనిందమోపిన ప్రజలపై ప్రభుత్వకోర్టులో కేసుదెచ్చి ప్రభుత్వాధి పత్యము నంగీకరించి యుండవలసినది.

### హిందూ మహమ్మదీయ పోరాటము.

ఢక్కాలో స్వల్ప కారణముపై హిందువుల మధ్య మహమ్మదీయులమధ్య పోరాటము జరిగినది. ఇండ్లు కాల్చబడినవి. ఇరుతెగలందు చాలమంది చంపబడిరి. శాంతిస్థాపనమునకు తీవ్రప్రయత్నములు జరుగుచున్నవి.

### యిరోపియ ఉద్యోగిని చంపుట.

పెషావరు ప్రాంతమున గుజర్ గార్హి గ్రామమునందు జరిగిన గలభాలయందు మర్ఫీ అను పోలీసు ఉద్యోగి రాళ్ళదెబ్బలలో …

